THE ANDHRA PATRIKA, MADRAS.



# ఆంధ్రపత్రిక



Regd. No. M, 1118 | సంపుటం 38. సంచిక 161 | FOUNDER · DESODHARAKA K. NAGESWARA RAO. | బుధవారం 12-9-1951 | వెల 1 అణా, హాఫ్ 0-1-2.

# విభజనసంఘ ప్రతిపాదనలు ప్రాతిపదికగ రాష్ట్రనిర్మాణానికి

## నెహ్రూ సంసిద్ధత

## ఆంధ్ర నాయకుల రాయబారానికి ప్రధానమంత్రి వాగ్దానం

### "మద్రాసు ప్రభుత్వం, 3 రాష్ట్రకాంగ్రెస్ సంఘాలూ విభజనసంఘుని వేదికను అంగీకరిస్తే చాలు"

న్యూఢిల్లీ, సెప్టెంబరు 10: "ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి నేను ఇదివరకే అంగీకరించాను. ఇంకా కాలయాపనచేస్తే అనవసరమైన సంకటస్థితి ఏర్పడుతుంది. కాబట్టి ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తీసుకోవలసిన చర్యలకు ఉపక్రమించడానికి వీలుగా మీరు లోగడ మద్రాసు విభజన సంఘ ప్రతిపాదనలను ఆంధ్ర, తమిళ, కర్నాటక రాష్ట్రాల కాంగ్రెస్ సంఘాలు, మద్రాసు ప్రభుత్వం అంగీకరించినట్లుగా నాకు ఒక అధికార ఒడంబడికను పంపండి" అని ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఆంధ్రనాయకుల రాయబారానికి సూచించారు.

ఈ ఒడంబడిక స్థూలంగా సరిహద్దులు, ఆస్తి, అప్పుల పంపకం తత్సంబంధమైన ఇతర విషయాలకు సంబంధించి ఉండాలని పండిట్ నెహ్రూ వివరించినట్లు 'హిందూ' పత్రిక న్యూఢిల్లీ విలేఖరి వ్రాస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డి, కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావు, రాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, కేంద్ర ఆహారశాఖ డిప్యూటీ మంత్రి శ్రీ యం. తిరుమలరావు, రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి అల్లూరి సత్యనారాయణరాజు ప్రభృతులు ఇవాళ పండిట్ నెహ్రూను కలుసుకొని ఆంధ్ర రాష్ట్రాన్ని వెన్వెంటనే ఏర్పాటు చేయవలసిన అవసరాన్ని వివరించారు. పండిట్ నెహ్రూ సూచనలు ఆశాజనకంగా ఉండటం చూచుకొని ఈ నాయకులు తక్షణం ప్రాయోపవేశాన్ని విరమించవలసిందని స్వామి సీతారాం ప్రభృతులను కోరుతూ టెలిగ్రాం ఇచ్చారు.

#### తమిళనాడు కాంగ్రెస్ అధ్యక్షుని ప్రకటన

తమిళనాడు కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ కామరాజనాడార్ ఈ రోజే ప్రధానమంత్రి పండిట్ నెహ్రూను విడిగా కలుసుకొన్నారు. అనేక ఇతర విషయాలతోపాటు వీరుభయులూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణంగురించి చర్చించినట్లు తెలుస్తున్నది. ఈ సమావేశానంతరం శ్రీ కామరాజనాడార్ పి. టి. ఐ. విలేఖరితో ముచ్చటిస్తూ

(2-వ పేజీ చూడుడు)

## పులిచింతప్రాజెక్టును భారత ప్రభుత్వం కన్నెత్తయినా చూడదు

### దర్యాప్తు పూర్తికాలేదుగనుక భారత ప్రభుత్వానికి సిఫార్సు చెయ్యలేదని భక్తవత్సలం ప్రకటన

మద్రాసు, సెప్టెంబరు 11: "పులిచింతల ప్రాజెక్టు దర్యాప్తులో పూర్తి కాలేదు. ఈ మధ్యన దర్యాప్తు జరగనే లేదు. దర్యాప్తు పూర్తి అయితేనే గాని మేము సిఫార్సు చెయ్యం. దీనికి రాజకీయాలు కారణం కాదు. మేము పులిచింతల ప్రాజెక్టును యీనాడు కేంద్ర ప్రభుత్వానికి పంపించినా వారు ...

లు డబ్బు యిచ్చినా ప్రభుత్వం పూను కొని పని చేసే స్థితిలో వుండదు. దక్షిణాదిన అమరావతి (కోయంబత్తూరు జిల్లా) ప్రాజెక్టుకు రూ 8 లక్షలు యిచ్చినా మేమింకా పనికి పూనుకోవడానికి వీలుపడలేదు. కృష్ణా ప్రాంతవాసులు డబ్బు ఇస్తామంటున్నారు. ఇష్టమున్నంత వేరు, ఇవ్వడం వేరు. 36 ...

(2-వ పేజీ చూడుడు)

## 'నెహ్రూ సలహా మేరకు కర్తవ్య నిర్వహణకు సిద్ధంగా ఉన్నాం'

### స్వామిసీతారాం ప్రాయోపవేశం విరమించాలని విజ్ఞప్తి చేస్తూ ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు సంజీవరెడ్డిగారి ప్రకటన

మద్రాసు, సెప్టెంబరు 11: "పండిత జవహర్‌లాల్ నెహ్రూను నిన్న ఉదయం మేము సందర్శించి తక్షణాంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకతనుగూర్చి చెప్పగా ఆయన రాష్ట్ర నిర్మాణంవల్ల స్వామిజీ ప్రాయోపవేశ సందర్భాన పరిపూర్ణమైన సానుభూతిని ప్రకటించారు. సానుభూతిని ప్రకటించడమేగాక, రాష్ట్రనిర్మాణానికి ఆంధ్ర, తమిళ, కర్నాటక నాయకులు ఒప్పందానికి రావడానికై ఒక ప్రణాళికను, కార్యక్రమాన్నిగూడా ఇచ్చారు. మేము మా కర్తవ్యాన్ని నెరవేర్చటానికి సంసిద్ధులమై ఉన్నాము. ఇంతటనైనా స్వామి సీతారాం ప్రాయోపవేశాన్ని విరమించి, రాష్ట్ర నిర్మాణాన్నిగూర్చి మా ఉద్యమాన్ని బలపరుస్తారని ఆశిస్తున్నాను" అని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు ఇవాళ ఉదయం ఢిల్లీనుంచి రావడంతోనే ఆంధ్రపత్రిక ప్రతినిధి సందర్శించగా చెప్పారు.

నీలం సంజీవరెడ్డిగారు ఈ విధంగా చెప్పారు: నేను, రాష్ట్రనిర్మాణంలో గాఢ ఆసక్తిగల మరికొందరు మిత్రులతో సహా నిన్న ఉదయం పండిత జవహర్‌లాల్ నెహ్రూగారిని సందర్శించాము. స్వామిజీ ప్రాయోపవేశాన్ని గూర్చి, తక్షణాంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకతనుగూర్చి, ప్రజాభిప్రాయాన్ని గూర్చి ఆయనకు నచ్చ చెప్పాము. మేము అతిగా ఆయనకు నచ్చ చెప్పవలసిన అవసరమే లేకపోయింది. ఎందువల్లనంటే రాష్ట్రనిర్మాణం ఎడ ఆయనే మాకన్న ముందుగా పరిపూర్ణ సానుభూతిని ప్రకటింపసాగారు. అంతేగాక ఆంధ్ర, తమిళ, కర్నాటక నాయకులు ఒప్పందానికి రావడానికి మాకు ఒక ప్రణాళికను, కార్యక్రమాన్నిగూడా సూచించారు.

మా కర్తవ్యాన్ని మేము పాలించటానికి సంసిద్ధతను వెల్లడించాము. రాష్ట్ర కాంగ్రెసు సంఘాలు, ఇతర ప్రజాహిత సంస్థలూ ఈ ప్రణాళికను ఆమోదించవలసి ఉంటుంది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమనగానే పరిష్కారం గావలసిన బహుళ సమస్యలను తెలిసిన స్వామివారు మా మాటలలో విశ్వాసముంచ, గోరుతున్నాను. భారత ప్రభుత్వంవారు కొత్తరాష్ట్ర నిర్మాణమనగానే కొంత అప్రమత్తులై ఉండక తప్పదు. రాష్ట్ర నిర్మాణాన్నిగూర్చి భారతప్రభుత్వం చిత్తశుద్ధిని ప్రశ్నించపనిలేదు. నెహ్రూ ప్రదర్శించిన సానుభూతిని, మా కర్తవ్యాన్ని నెరవేర్చడంలో మేము తెలిపినమాటను పురస్కరించుకొని స్వామీ సీతారాం ప్రాయోపవేశాన్ని విరమించవలెనని ప్రార్థిస్తున్నాను.

## స్వామిసీతారాంప్రాయోపవేశం: సర్వోదయనాయకుల ఆసక్తి

### మధ్యవర్తిగా వ్యవహరించడానికి ఆచార్య వినోబాభావే అంగీకారం

(ఆంధ్రపత్రిక ప్రత్యేక విలేఖరి)

...

(4-వ పేజీ చూడుడు)

## ఇండియాకు కెనడా ఆర్థిక సహాయం

### సిద్ధాంతాలపై అంగీకారం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 10. కొలంబో ప్రణాళిక రీత్యా ఏయే సిద్ధాంతాల ప్రాతిపదికపై కెనడా ఇండియాకు ఆర్థిక సహాయం చేయనున్నది వివరిస్తూ ఈ ఉభయ దేశాల ప్రభుత్వాలు ఈ రోజున ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకున్నట్లు భారత ప్రభుత్వ విదేశాంగ శాఖ ప్రకటించినది.

ఆ ప్రకటనలో ఇలా ఉన్నది:- "కొలంబో ప్రణాళికరీత్యా ఆయా కార్యక్రమాల కార్యాచరణకు గాను కెనడా సరకులను, నిపుణులను సహాయం చేస్తుంది. ఈ ఉభయ దేశాల ప్రభుత్వాలకు అంగీకారం కుదిరే ప్రణాళికల విషయంలోనే ఇట్టి సహాయం జరుగుతుంది. వివిధకాల ప్రణాళికల కార్యాచరణకై ఆయా సందర్భాలకు అనుగుణంగా ఋణాల రూపంగా గాని, గ్రాంట్ల రూపంగా కాని కెనడా ఆర్థిక సహాయం చేస్తుంది. ఆయా ప్రణాళికలపై కూడా ఉభయ దేశాలకు అంగీకారం కుదరవలసి ఉన్నది.

## నెహ్రూరాజీనామాఉపసంహరణ సాధించడానికి టాండన్ కృషి

### ప్రధానమంత్రికీ - కాంగ్రెస్ అధ్యక్షునకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల ప్రచురణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 10: కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వానికి పండిట్ నెహ్రూ రాజీనామా ఇచ్చినమీదట తమ ఉభయులకూ నడిచిన ఉత్తరప్రత్యుత్తరాలను శ్రీ పురుషోత్తమదాస్ టాండన్ గారు ప్రకటనార్థం ఈ వేళ విడుదల చేశారు.

ఇప్పుడు కొత్తగా రానవసరంలేదు. ఎందుచేతనంటే అది మీకూ నాకూ కార్యవర్గ సభ్యులందరికీకూడా మొదట్నుంచీ ఉంటూవుంది. ఇట్టి సందర్భంలో ఈ చిత్తక్షోభాని కంతకూ మూలకారణం ఏదైతే వుందో దానిని తొలగించడం కంటే నేను చేయ ...

... కొంటున్న అసలు సమస్యలను సంపూర్ణంగా అవగాహన చేసుకొని దానికి నేను అవలంబించి నటువంటి చాటుమాటులేని బహిరంగమైన పద్ధతిని అవలంబించడమే ఉత్తమమని నా అభిప్రాయం" దానికి శ్రీటాండన్ గారు మీరు ప్రస్తావించిన విషయాలన్నిటికీ వివరంగా సమాధానం ఇవ్వటానికి ఇది సందర్భంకాదు; కాని కాంగ్రెసు సంస్థయొక్క పరువు ప్రతిష్ఠలనూ నైతిక ప్రతిపత్తిని పెంచాలన్నదే మొదట్నుంచి నా తాపత్రయం; తక్కిన విషయాలన్నీ నాదృష్టిలో అప్రధానమైనవి. అనిమాత్రం ఇక్కడ స్పష్టపరచడం అవసరం" అని వ్రాశారు.

### చలపతిరావుగారి రాజీనామా సమర్పణ

విజయవాడ, సెప్టెంబరు 11: విజయవాడ మునిసిపల్ చైర్మన్ డా॥ టి. వి. ఎస్. చలపతిరావుగారు తమ చైర్మన్ పదవికీ, కౌన్సిలర్ స్థానానికి రాజీనామా వ్రాసి, అపత్రాన్ని స్వామీ సీతారాంగారి అధీనం చేయబోతున్నట్లుగా పత్రికా విలేఖరులతో చెప్పారు. తానీ పదవిలో వుండటం కంటే, అందునుండి వెలికివస్తేనే ఆంధ్రదేశానికి తనకు యెక్కువ అవకాశం వుండగలదని ఆయన భావిస్తున్నారు.

## బ్రిటన్‌కు పర్షియాశ్రీముఖం

### పక్షం రోజుల్లో రాయబారాలు ప్రారంభించాలని ప్రధాని సూచన

### తప్పితే బ్రిటిష్ ఉద్యోగులను దేశంనుంచి బహిష్కరించగలమని మస్సాదిక్ హెచ్చరిక

టెహరాన్, సెప్టెంబరు 11: ట్రూమన్ దూత అవెరిల్ హారిమన్ ద్వారా పర్షియా ప్రధాని బ్రిటన్‌కు నూనెతగాదా విషయమై శ్రీముఖాన్ని నేడు అందజేయనున్నట్లు తెలుస్తున్నది.

నూనె తగాదా విషయమై సంభాషణలను తిరిగి 15 రోజుల్లో ప్రారంభించారా సరేసరి. లేదా అబదాన్‌లో వున్న 350 మంది బ్రిటిష్ సాంకేతికులను బయటికి పంపించి వేయడం జరుగుతుంది. అని ఆయన ఈ శ్రీముఖంలో బ్రిటన్‌ను హెచ్చరించగలరనుకుంటున్నారు.

ఆదివారంనాడు పర్షియాపార్లమెంటు సమావేశంలో ప్రధాని మొసాదిక్ ఈ విషయాన్ని వెల్లడిచేశారు. అయితే అవ్వాళ కోరంలేని కారణంగా ఓటింగు ఏమీ జరగలేదు. ఇక ముందు ఇట్లా దిగువ సభకు కోరం లేకపోతే, సెనెట్ ఎట్లాగూ తన సూచనలను ఆమోదించి వుంది కాబట్టి దిగువసభ ప్రమేయం లేకుండానే తాను ఈ శ్రీముఖాన్ని బ్రిటన్‌కు పంపగలనని డా॥ మొసాదిక్ నేడు ప్రకటించారు.

అయితే, ఉపప్రధాని డా॥ హుస్సేన్ ఫతేమీ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ ప్రతిపక్షులు గనుక నేడు పార్లమెంటును సమావేశపరచి, విజయాన్ని సాధించగల్గితే, అసలు ఈ శ్రీముఖాన్ని పంపడం అంటూ నే జరక్కపోవచ్చునని చెప్పారు. కాని, ప్రతిపక్షులకు విజయం అంటూ లభించడం అంతగా సాధ్యం అయినవిషయం కాదని రాజకీయజ్ఞులు చెబుతున్నారు.

బ్రిటిష్ రాయబారి సర్ ఫ్రాన్సిస్ షెప్పర్డు ఈ నూనె సమాలోచన విషయమై బ్రిటన్ అభిప్రాయాన్ని ...

... వులు అయిన తిర్యాతి వారు అబాదాన్‌కు తిరిగి వచ్చేందుకు వీలులేదని తెలియజేశారు. ఆంగ్లో ఇరానియన్ కంపెనీ రవాణా మేనేజరుకే వీసాను వారు ఇయ్యలేదు.

పర్షియా నూనె తగాదా సవ్యంగా పరిష్కారం కాకపోతే, ఆ తప్పంతా బ్రిటన్‌దే కాని మరెవ్వరిదీ కాదని పర్షియా ప్రభుత్వం వ్యాఖ్య నేడు వివరించారు. సమాలోచనలు ప్రారంభించడానికి పర్షియా అప్పుడు కాదు ఇప్పుడు కూడా సిద్ధంగా వుంది. అయితే, అర్థం పర్థం కానటువంటివి, బ్రిటన్‌కు లాభకారి కానటువంటివి కొన్ని అంశాలమీద బ్రిటన్ ఎక్కువ పట్టుబట్టడం అసహజంగా వుంది. అని ఆయన ఈ సందర్భంలో ఉద్ఘోషించారు.

ఈ విషయాలను ఆయన పర్షియా రేడియో ఇక్లంకు కార్యక్రమంలో మాట్లాడుతూ వెల్లడి చేశారు.

### రాంఛన రేషనింగు ప్రాంతాలు

మద్రాసు, సెప్టెంబరు 11: మిగులు జిల్లాల్లోని లాంఛన రేషనింగు ఉన్న ప్రాంతాల్లో సెప్టెంబరు 9 వ తేదీ నుంచి 8 ఔన్సులు బియ్యం నాల్గు ఔన్సులు గోధుమ, జొన్న, లేక మైలో ఇస్తామని మద్రాసు ప్రభుత్వం వారు ప్రకటించారు.

## పర్షియాకు డాలర్ సప్లయి

### ప్రత్యేకసౌకర్యాల రద్దుకు బ్రిటన్ నిర్ణయం

లండన్, సెప్టెంబరు 10: ...

### భూమిలేనివారికి రేషన్లు

మద్రాసు, సెప్టెంబరు 11: ...

